# వేమన ఒక క్రియా యోగి

ఓం నమో శ్రీ యోగానందగురవేనమః

నేను ఒక క్రియాయోగిని. నా ధ్యానసమయములో ఒకసారి యోగివేమన గురించి ధ్యానము చేశాను. ఆ సమయములో ఆ మహాయోగిని ఈ విధముగా ప్రశ్నించాను:

నీవు వ్రాసిన పద్యములలో యోగము గురించి ప్రస్థావన ఏమీలేదు, పైగా వినురవేమా, వినురవేమా అని స్వంత డబ్బా కొట్టుకుంటావేమిటి? అని అడిగాను. దానికి ఆ మహాయోగి ఈవిధముగా ఒక్కొక్క పద్యమునకు అంతరార్థము స్ఫురింపచేశాడు ఆ మహాయోగి. ఆ అంతరార్థమునుబట్టి ఆ మహాయోగి ఒక క్రియాయోగి అనిఅర్థము అయినది. అందులో మచ్చుకు కొన్ని పద్యములు పొందు పరుస్తున్నాను:

1) చెప్పులోనరాయి చెవులోన జోరీగ
   కంటిలోన నలుసు కాలులోన ముల్లు
   ఇంటిలోన పోరు ఇంతింత కాదయా
   విశ్వదాభిరామ వినురవేమా

వినురవేమా అనగా వేరయిన మనసుతో వినురా అని అర్థము..

వేరయిన మనసు అనగా స్థిరమయిన మనసు అని అర్థము.

స్థిరమయిన మనసుతో చెవులోన జోరీగ అనగా గొంతులోని విశుద్ధ చక్రములో ఉపాంశు రీతిలో జోరీగ మాదిరిగా ఓంకారాన్ని చెప్పులోనరాయి అనగా మనస్సులో చెప్తూ రాయి. ఇంటిలోన పోరు ఇంతింత కాదయా అనగా 'దేహో దేవాలయోప్రోక్తః జీవోదేవః సనాతనః '

ఈ దేహమే ఒక ఇల్లు. ఆ ఇంటిలోని పోరు అనగా ఇంద్రియములపోరు అనగాఇంద్రియములు

అనగా కన్ను సినిమాచూద్దామని, నోరు నానా గడ్డితిందామని వగయిరా , అనుకుంటూ

ఉంటాయి. కనుక ఓంకారాన్ని మనస్సులో చెప్తూ రాసుకుంటూఉంటే, అప్పుడు కంటిలోన నలుసు కాలులోన ముల్లు అనగా లోపల ఉన్న అజ్ఞానాన్ని నలుసును అనగా అజ్ఞానాన్ని కంటావు. ఓంకారాన్ని మనస్సులో చెప్తూ రాసుకుంటూఉన్నావు కాబట్టి లోపలి ముల్లుఅనగా అజ్ఞానము కాలిపోతుంది.

తాత్పర్యము ఏమిటంటే, ఓంకారాన్ని మనస్సులో చెప్తూరాసుకుంటూ ఉంటే, ఇంటిలోని ఇంద్రియములపోరు బాధతప్పి, మనలోని అజ్ఞానాన్ని కంటాము. అది కాలిపోతుంది.

అంతరంగమందు అభవునుద్దేశించి నిలిపిచూడచూడనిలుచుగాక

బాహ్యమందు శివుని భావింపనిలుచునా విశ్వదాభిరామ వినురవేమా 2

వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,

మెడని నిఠారుగా ఉంచి చూపుడువేలును రెండుకనులమధ్య ఉంచి పాలభాగమునకు ఆనించి కొద్ది కొద్దిగా ఆవేలు కొనని పైకెత్తుతూ చూస్తూ ఉండాలి. ఆ కొన కనబడుట ఆగినచోట దృష్టిని నిలుపవలెను. దీనిని కూటస్థములోదృష్టి నిలుపుట అందురు. దీనినే అంతరంగమందుదృష్టి నిలుపుట అనికూడా అంటారు. అనగా అంతర్ముఖమగుట. అంతర్ముఖ దృష్టిని అభ్యాసము చేయగా చేయగా దృష్టి స్థిరమగును. శివుని పొందుకు అనగా పరమాత్మ పొందుకు అంతర్ముఖ దృష్టి అత్యవసరము. ఇది ఒక క్రియాయోగ ప్రక్రియ. పరమాత్మ పొందుకు స్థిర శ్వాస లేక స్థిర మనస్సు అవసరము. శ్వాసని స్థిరము చేసిన మనస్సు స్థిరమగును. మనస్సు స్థిరము చేసిన శ్వాస స్థిరమగును. అనగా ఒకటి స్థిరమయిన రెండవది తనంతటతానె స్థిరమగును. చంచలశ్వాస లేదా చంచలమనస్సు చంచలదృష్టికి లేదా బాహ్యదృష్టికి కారణమగుచున్నది. అనగా కన్ను, ముక్కు లాంటి ఇంద్రియ విషయములు బాహ్యమందు సంచరించును. కనుక బాహ్యమందు శివుని భావింప, నిలుచునా అనగా అంతర్ముఖమవనిది శివుని పొందు సాధ్యమా అని అర్థము. సాధ్యముకాదు..

అడవిదిరుగజిక్కదాకసమునలేదుఅవనితీర్థయాత్రలందులేదు

ఒడలుశుద్ధిచేసిఒడయనిచూడరా విశ్వదాభిరామ వినురవేమా 3

వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,

అడవులలోదిరిగినాచిక్కదుపరమాత్మపొందు,ఆకాశములోచిక్కదు, భూమిమీది తీర్థయాత్రా స్థలము లందునూ దొరకదు. ఒడయని అనగా పరమాత్మని కేవలము ఒడలు అనగా స్థూల, సూక్ష్మ మరియు కారణ శరీరములు శుద్ధిచేసిన యడలచూడగలవురా సాధకుడా అని అర్థము.

అదిమిమనసునిలిపిఆనందకేళిలోబ్రహ్మమయుడుముక్తిబడయగోరు
జిహ్వారుచులచేత జీవుండు చెడునయా విశ్వదాభిరామ వినురవేమా 4

వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,
అదిమిమనసునిలిపి అనగా మనసు స్థిరము చేసి బ్రహ్మమయుడు అనగా బ్రహ్మ సాధకుడు ఆనందకేళిలో అనగా పరమానందప్రాప్తి బడయగోరు అనగా పొందగోరును.. జిహ్వారుచులచేత జీవుండు చెడునయా అనగా నాలుక, చెవి, చర్మము, కన్ను, ముక్కు లాంటి ఇంద్రియసుఖములతో మనిషి ఇంద్రియలోలుడై జననమరణ చక్రములోబడి చెడిపోవును.

అనగననగ రాగ మతిశయిల్లుచునుండు తినగ తినగ వేము తీయనుండు
సాధనమునపనులు సమకూరు ధరలోన విశ్వదాభిరామ వినురవేమా 5

వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,
ఏ విధముగా తినగ తినగ వేము తీయగా నుండునో అదేవిధముగా అనగననగ రాగ మతిశయిల్లుచునుండు అనగా ఓంకార ఉచ్చారణ చేయగా చేయగా శోబిల్లుతుంది
ఆ ఓంకార ఉచ్చారణ సాధనమున ధరలోని అనగా ఈ భూమిమీదిమనిషి చేయవలసిన సాధనా పనులు సమకూరును.

ఆత్మలోనశివుని అనువుగా శోధించి నిశ్చలముగ భక్తినిలిపెనేని
సర్వముక్తుడౌను సర్వంబుతానౌను విశ్వదాభిరామ వినురవేమా 6

వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,
అంతర్ముఖమై నిశ్చలమైన భక్తితో చక్కగా శోధించి తనలోనే పరమాత్మను సందర్శించవలెను. బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి అనగా బ్రహ్మజ్ఞానము కలిగినవాడే బ్రహ్మ అగును. ఆ విధముగా, చేసిన సాధకుడు అన్నింటినుండి విముక్తిపొంది, సర్వము తానె అగును.

ఆత్మలోని సొమ్ము అంజనమునజూచి అంటితిరుగునట్టియతడుయోగి
పుంజుగూటినుండిపొద్దెరింగియుకూయు విశ్వదాభిరామ వినురవేమా 7

వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,
అంజనము అనగా కూటస్థములోని మూడవకన్ను. ఆ జ్ఞానసేత్రములో కనబడు ఆత్మలోని సొమ్ము అనగా పరమాత్మప్రకాశమును జూచి, దానినే అంటిపెట్టుకొని, కోడిపుంజు పొద్దు తెలిసి వెంటనే కూసిన విధమున, తిరుగునట్టి అనగా అస్పందనముతో మమైకమయినట్టి యతడు యోగి.

ఆలుసుతులుమాయ అన్నదమ్ములుమాయ తల్లిదండ్రులుమాయ తానుమాయ
తెలియనీదుమాయ దీనిల్లుపాడాయ విశ్వదాభిరామ వినురవేమా 8
వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,
మాతా నాస్తి, పితా నాస్తి, నాస్తి,బంధు సహోదరాః అర్థం నాస్తి, గృహం నాస్తి, తస్మాత్ జాగ్రత జాగ్రతః
మా అనగా కాదు, య అనగా యదార్థం.
భార్యాపుత్రులు, అన్నదమ్ములు, తల్లిదండ్రులు, స్వయంగా తాను, తను నివసించే ఇల్లు అనగా ఈ శరీరము అన్నీ యదార్థం కాదు అని తెలియనీయదు ఈ మాయ అనగా పరమాత్ముని స్వప్నము.

ఇహమువిడువఫలము యింపుగగలదనిమహిని బలుకువారిమతముకల్ల
ఇహములోనఫలమునెసగుట కానరో విశ్వదాభిరామ వినురవేమా 9
వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,
ఈ లోకములోని ఫలములు ఇక్కడనే విడుచుట మంచిదనే చెప్పే వారి మతము కుదరనిపని. ఇక్కడి మంచి చెడు ఫలములు మనవెంట జన్మజన్మలు పడుతూనే ఉండుననే విషయము గ్రహించు.

ఉన్నఘనతబట్టిమన్నింతురేగాని పిన్నపెద్దతనములెన్నబోరు
వాసుదేవువిడిచి వసుదేవునెంతురా విశ్వదాభిరామ వినురవేమా 10
వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,
నీవు చేసే సాధనాతీవ్రతనుబట్టి, ఘనతనుబట్టి మన్నింతురేగాని, సాధకుడు చిన్నవాడా లేక పెద్ద వాడా అని చూడరు ప్రజలు. వాసుదేవుని అనగా శ్రీకృష్ణునికి పూజలు చేయుదురేకాని, పౌండ్రక వసుదేవునికి పూజలు చేయరు కదా.

ఎరుక కన్నను సుఖ మేలోకమునలేదు యెరుక నెరుగ నెవని కెరుక లేదు
యెరుక సాటి యెరుక యెరుకయే తత్వంబు విశ్వదాభిరామ వినురవేమా 11

వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,
పరమాత్మ నాలో ఉన్నాడు అనే పరిపూర్ణమైనజ్ఞానమే ఎరుక. అదియే బ్రహ్మజ్ఞానము. ఆ ఎరుక కన్నను అనగా ఆ జ్ఞానముకన్నా సుఖము ఏ లోకమునను లేదు. అది సాధనద్వారా తెలిసు కొనవలయును. ఆ జ్ఞానము ఎవ్వనికీ లేదు. బ్రహ్మజ్ఞానమునకు సాటి బ్రహ్మజ్ఞానమే. అదే తత్వము.

కట్టెయందునిప్పుగాననిచందాన తనువునందునాత్మ తగిలియుండు
మరుగుదెలిపిపిదపమార్కొనవలెనయా విశ్వదాభిరామ వినురవేమా 12
వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,
కట్టెయందు మండేగుణముఉంటుంది, అది కనబడదు. అదేవిధముగా శరీరములోని కూటస్థుడగు ఆత్మ దృగ్గోచరముకా దు. ఆ రహస్యం తెలిసిన పిదప పద్ధతి మార్చుకొని సాధన చేయవలెను.

కడకనఖిలమునకు నడినాళమందున్న వేగుచుక్కవంటివెలుగుదిక్కు
వెలుగుకన్నదిక్కువేరెవ్వరున్నారు విశ్వదాభిరామ వినురవేమా 13
వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,
బ్రహ్మాండమునకు దాని మధ్యనున్న వేగుచుక్కవెలుగువంటి పరమాత్మప్రకాశమే ఆధారము. ఆ ప్రకాశమునకు మించి వేరే దిక్కు లేదు.

చదువు చదువకున్న సౌఖ్యంబులును లేవు చదువు చదివెనేని సరసుడగును
చదువు మర్మమెరిగి చదివిన చదువురా విశ్వదాభిరామ వినురవేమా 14
వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,
విద్య నేర్చుకున్న సంస్కారము తత్తదుపరి సౌఖ్యము కలుగును. కాని మర్మమెరిగి చదివిన చదువు చదువురా అనగా పరమాత్మ పొందుతెలుపు సా విద్యా ఆధ్యాత్మ విద్యా, ఆధ్యాత్మిక విద్యయే అసలైన విద్య. అదే మర్మమెరిగి అనగా పరమార్థము తెలిసుకొని చదవటము.

చిత్తశుద్ధి గల్గి చేసిన పుణ్యంబు కొంచెమైన నదియు కొదువగాదు
విత్తనంబు మర్రి వృక్షంబునకు నెంత? విశ్వదాభిరామ వినురవేమా 15
వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,
అపిస్వల్పస్య త్రాయతే మహతో భయాత్. అని గీతా వాక్యము. యోగ సాధన కొంచెము చేసిననూ, అది భయంకరమైన సంసార దుఃఖమునుండి పోగొట్టును. ఆ విధముగా, యోగ సాధన వలన కలిగే

చిత్తశుద్ధి, నది కొంచెమైనను, మన భయమును పోగొట్టును. మర్రి వృక్షము పెద్దదైననూ దానివిత్తనము చిన్నదేగదా.

జనన మరణములకుతను స్వతంత్రుడుగాడు మొదట కర్తగాడు తుదను కాడు
నడుమకర్తననుటనగుబాటుకాదొకో విశ్వదాభిరామ వినురవేమా 16
వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,
అవ్యక్తాదీనిభూతాని వ్యక్తమధ్యానిభారత, అవ్యక్తనిధనాన్యేవ తత్రకాపరిదేవనా (గీత 2—28), గీతలో చెప్పినదికూడా ఇదే.

బ్రతుకులన్ని మాయ భవబంధములుమాయ తెలివిమాయ తన్నుతెలియమాయ
మాయదెలియువాడె మర్మజ్ఞుడగు యోగి విశ్వదాభిరామ వినురవేమా 17
వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,
మా అనగా కాదు, య అనగా యదార్థము, మాయ అనగా యదార్థము కాదు.
బ్రతుకులన్ని యదార్థము కాదు, సంసారబంధములు యదార్థము కాదు, మాయ యొక్క తెలివితో తననుతానూ తెలిసికోలేకపోయే. సాధనద్వారా ఇది యదార్థము కాదు అని తెలుసుకొన్నవాడే అసలైన యోగి.

బ్రహ్మమనగవేరెపరదేశమునలేదు బ్రహ్మమనగ తానెబట్టబయలు
తన్నుతానెరిగినతానెపోబ్రహ్మంబు విశ్వదాభిరామ వినురవేమా 18
వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,
బ్రహ్మము అనగా పరమాత్మ. పరమాత్మ వేరే దేశమున లేక లోకమున లేదు. తనే బ్రహ్మము. తనను తాను తెలిసుకొనిన తనే బ్రహ్మము అగును. భగవాన్ రమణ మహర్షి కూడాను 'నేను ఎవరిని' అని తెలిసికోమంటారు.

మనసులోనేపుట్టె మాయసంసారము మనసు విరిగెనేని మాయతొలగు
మనసునిల్పెనేని మహి తానే బ్రహ్మము విశ్వదాభిరామ వినురవేమా 19
వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,
యదార్థము కాని సంసారము మనసులోనే పుడుతుంది. మనసు విరిగితే మాయతొలగుతుంది. సాధనతో మనసుని స్థిరపరచవలయును. అపుడు తానె బ్రహ్మమగును.

మాటలుడగకున్న మంత్రంబు దొరకదు మంత్రముడగకున్న మదికుదురదు
మనసునిల్పకున్న మరి ముక్తిలేదయా విశ్వదాభిరామ వినురవేమా 20

వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,

మన్ త్రాయతే ఇతి మంత్రః అనగా మనస్సును రక్షించేది మంత్రము. ఓంకారోచ్చారణ చేసి చేసి ఆగినప్పుడు ఆ నిశ్శబ్దములో మంత్రము (ఓంకారము) వినబడును. ఆ ఓంకారము వినబడుట ఆగినప్పుడు మనస్సు స్థిరమగును. దీనినే కేవల నిశ్శబ్దము అందురు. ఆ నిశ్శబ్దములో స్థిరమయిన మనస్సే శుద్ధ మనస్సు. అప్పుడు ముక్తి లభించును. ఇదంతా క్రియాయోగ ప్రక్రియ.

మాయలోన బుట్టి మాయలోన బెరిగి మాయ దెలియ లేని మనుజుడేల
మాయ దెలియువాడు మహిమీద ధన్యుండు విశ్వదాభిరామ వినురవేమా 21

వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,

మా అనగా కాదు, య అనగా యదార్థము, మాయ అనగా యదార్థము కాదు.

మాయలోనే బుట్టి మాయలోన బెరిగినప్పటికీ మనుజుడికి ఈ మాయ తెలియుటలేదు. సాధనతోనే మాయ తెలియును. భూమిమీద ఈ మాయ తెలిసినవాడే ధన్యుడు.

రామనామజపముచే మున్ను వాల్మీకి పాపి బోయడయ్యు బాపడయ్యె
కులము ఘనము గాదు గుణమె ఘనమ్మురా విశ్వదాభిరామ వినురవేమా 22

వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,

రామనామజప సాధనచే పూర్వము వాల్మీకి బ్రహ్మజ్ఞానము పొందిన బ్రాహ్మణుడయ్యెను.

ఏకులములో జన్మించినా సాధనా గుణము ఉంటే ఘనుడగును.

లోను జూడ జూడ లోకాభిరామంబు బయలు జూడ జూడ బంధనంబు
తన్ను జూడ జూడ తారకబ్రహ్మంబు విశ్వదాభిరామ వినురవేమా 23

వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,

అంతర్ముఖమైన మోక్షము, బహిర్ముఖమైన సంసారబంధనం, తనను తాను అనగా తన శ్వాసను తాను చూచుకుంటున్నట్లయితే పరమాత్మలో మమైకము. క్రియాయోగ సాధనలో ఇది ఒక ప్రక్రియ.

వేదవిద్యలెల్ల వేశ్యలవంటివి భ్రమలబెట్టి తేటపడగ నీవు
గుప్తవిద్య యొకటే కులకాంతవంటిది విశ్వదాభిరామ వినురవేమా 24

వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,
వేదవిద్యలన్నీ మనుజుడు ఏమి చేయాలి ఏమి చేయకూడదో తెలియని స్థితిని కలగజేసి ఒక్కొక్కప్పుడు తికమక పెడతాయి. పరమాత్మపొందుకు సరిఅయిన దారి చూపించగలది గుప్తమైన క్రియాయోగ విద్య మాత్రమె.

వాక్కు వలన గలుగు పరమగుమోక్షంబు వాక్కు వలన గలుగు వరలు ఘనత
వాక్కు వలన గలుగు నెక్కుడైశ్వర్యముల్ విశ్వదాభిరామ వినురవేమా 25
వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,
వాక్కు అనగా ఓంకారోచ్చారణ. దానివలన ఘనత,ఐశ్వర్యము,మరియు మోక్షము అన్నీ కలుగును.

శిలను ప్రతిమజేసి చీకటింటనుబెట్టి మొక్కవలదికనుమూఢులార
ఉల్లమందు బ్రహ్మముండుట తెలియుడీ విశ్వదాభిరామ వినురవేమా 27
వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,
విగ్రహపూజవలన ఉపయోగము శూన్యము, హృదయములోనే ఉన్న పరమాత్మను యోగ సాధనద్వారా తెలిసికొనవలయును.

ఉప్పుకప్పురంబు ఒక్కటై ఉండు చూడ చూడ రుచులు జాడ వేరు
పురుషులందు పుణ్యపురుషులు వేరయా విశ్వదాభిరామ వినురవేమా 28
వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,
యోగీ భోగీ ఉప్పు కర్పూరము లాగా ఒక్కటిగానే ఉంటారు చూడటానికి. కాని వారి వారి అభిరుచులు వేరుగా ఉంటాయి. డాక్టర్ చదవితే డాక్టర్ వెంకట్రావ్, లా చదవితే లాయర్ వెంకట్రావ్ లాగా, అలాగే బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి అనగా బ్రహ్మ జ్ఞానము తెలిసినవాడు బ్రహ్మ అవుతాడు. అలాగే పురుషులందే పుణ్యపురుషులయినయోగులు వేరుగా ఉంటారు.

గంగిగోవుపాలు గంటెడైనను చాలు కడివెడైననేమి ఖరముపాలు
భక్తికలుగుకూడు పట్టెడైనను చాలు విశ్వదాభిరామ వినురవేమా 29
వినురవేమా అనగా వేరయిన అనగా స్థిరమనసుతో వినురా ఓ సాధకుడా,
గంగిగోవు అనగా మేరుదండము లేదా వెన్నెముక. యోగికి నిఠారుగా కూర్చొని ధ్యానము చేయుటకు మేరుదండము చాలా అవసరము. పాలు అనగా భాగము.

అహంకారముతో చేసే పూజలకంటే, మేరుదండముతో నిఠారుగా కూర్చొని చేసే ధ్యానము భాగము కొంచెము సమయమయిన చాలు. భక్తికలుగుకూడు అనగా అదే నిజమయిన భక్తి కలుగచేయును.

ఆకుమీదివ్రాత అందరికి తెలియు చేతిలోనివ్రాతచెప్పవచ్చు
తోలుకిందివ్రాతదొడ్డవాడెరుగును విశ్వదాభిరామ వినురవేమా 30

ఆకు అనగా ఆధునిక ప్రపంచములో కాగితముమీదివ్రాత చదువుకున్న వారు అందరూఅర్థము చేసికోవచ్చు. చేతిలోనివ్రాతను హస్తసాముద్రికము నేర్చుకున్నవారుచెప్పవచ్చు. తోలుకిందివ్రాత అనగా బ్రహ్మరాత కేవలము ఆ పరమాత్మకిమాత్రమే తెలుసు.

ఇంద్రియములుబట్టిఈడ్చుచునుండగా వెర్రిమనుజుడేల వెదకుశివుని
ఇంద్రియములురోసి ఈశునిజూడరా విశ్వదాభిరామ వినురవేమా 31

ఇంద్రియలోలుడైన వెర్రిమనుజుడు శివుని వెదకలేడు. క్రియాయోగసాధనతో కలిగిన వైరాగ్యముతో ఇంద్రియవ్యాపారములను అరికట్టి పరమాత్మని పొందవలయును.

ఇల్లునాలివిడిచి ఇనుపకచ్చలుగట్టి వంటకంబునీటివాంఛలుడిగి
ఒంటినున్నంత యంత ఒదవునా తత్వంబు విశ్వదాభిరామ వినురవేమా 32

ఇల్లు, పెళ్ళాంబిడ్డల్ని వదిలి కాలికి ఇనుప చెప్పులు వేసికొని తిరిగినా, నీరు ఆహారములకు దూరమై ఒంటరిగానున్నంత మాత్రాన తత్వజ్ఞానము అబ్బదు. దానిని క్రియాయోగసాధనతో పొందవలయును.

ఇహము విడువఫలముయింపుగగలదని మహినిబలుకువానిమతముకల్ల
ఇహము లోనఫలము నెసగుట గానరో విశ్వదాభిరామ వినురవేమా 33

మాయలో అనగా సంసారములో ఉంటూ మాయ(సంసారము)ని జయించుట సాధన ద్వారా నేర్చుకొనవలయును. అంతేగానిసంసారము వదలమని గాదు.

ఒడలబూదిబూసి జడలుధరించిన ఒడయుడైన ముక్తి బడయలేడు.
తడకబిర్రుబెట్ట తలుపుతో సరి యౌనె విశ్వదాభిరామ వినురవేమా 34

శరీరమంతా బూడిద బూసికొని జడలు ధరించినతమాత్రాన ముక్తి పొందాడు. తడిక ఎంతగట్టిదైనా తలుపుతో సరిగాదు. యోగసాధన ద్వారానే ముక్తి సాధ్యము.

చిత్తశుద్ధి గల్గి చేసిన పుణ్యంబు కొంచెమైన నదియు కొదువగాదు
విత్తనంబు మర్రివృక్షంబునకునెంత విశ్వదాభిరామ వినురవేమా 35

అపిస్వల్పస్య త్రాయతే మహతో భయాత్. ఈ యోగసాధన స్వల్పముగా చేసినా మహత్తరమైన సంసార భయమును పోగొడుతుంది అని గీతా వాక్యము. మర్రివిత్తనము చిన్నదే. దానిలోనుండి వచ్చేది అతిపెద్దదైన మర్రివృక్షం. కనుక యోగసాధన వలన చిత్తశుద్ధి కలగును. ఆ పుణ్యము కొంచెమైనను చాలా మంచిది.

జనన మరణములకు తను స్వతంత్రుడుగాడు మొదట కర్తకాడు తుదనుకాడు
నడమకర్తననుట నగుబాటుకాదొకో విశ్వదాభిరామ వినురవేమా 36

అవ్యక్తాదీని భూతానివ్యక్తమద్యాని భారత. గీత 2వ అధ్యాయము సాంఖ్యయోగము లోని 28 వ శ్లోకము నాకు ప్రతీక. వేమన ఎంతటి మహాయోగియో దీనినిబట్టి అర్థమగుచున్నది. మనిషి పుట్టుకకు పూర్వము కనబడకయు, పుట్టిన పిదప కనబడుచును, మరణించిన పిదప మరల కనబడకయు యున్నవి. అట్టి శరీరము నాది యని శోకించుట అవివేకము.

తోలుకడుపులోన దొడ్డద్దవాడుండంగ రాతిగుళ్ళనేల రాశిబోయ
రాలుదేవులైన రాశులు మింగవా విశ్వదాభిరామ వినురవేమా 37

ఇక్కడ విగ్రహపూజని నిరశిస్తున్నారు యోగి వేమన. పరమాత్మ మనలోనే ఉండగా రాతిగుళ్ళచుట్టూ తిరుగుటవ్యర్థము. జడమైన రాళ్ళే దేవుళ్ళైతే ధన రాశులను మింగుతాయి.

బెసికంటివాని పెంపారమదినిల్పి పూజసేయవలెనుబుద్ధినిల్పి
ఆత్మపూజకంటే అదనంబులేదయా విశ్వదాభిరామ వినురవేమా 38

రెండు భ్రూమధ్యముల మధ్యనున్న ప్రదేశమును కూటస్థము అంటారు. మెడ నిఠారుగాఉంచి కూటస్థములో దృష్టిని నిల్పి, బుద్ధినిల్పి, మనస్సు స్థిరం చేసి పూజ అనగా ధ్యానము చేయవలెను.




అప్పుడు

తీవ్రమైన లోతైన ధ్యానములో యోగి ఆత్మను కూటస్థములో అద్భుతమైన ప్రకాశముగాను, శుద్ధజ్ఞానముగాను మరియు ఓంకార నాదముగాను అనుభూతి పొందుతాడు. దీనినే మూడవ నేత్రము లేదా శివుని మూడవ లేదా బేసికన్ను అంటారు. అంటారు. ఎన్ని ప్రవచనములు విన్ననూ ఈ అనుభూతిని మనిషి పొందలేడు. కేవలము ధ్యానము ద్వారానే ఈ అనుభూతిని మనిషి పొందగలడు.. ధ్యానము ద్వారా పొందిన జ్ఞానమే జ్ఞానము. దీనినేఆత్మపూజ అంటారు. దీనిని మించినదేదియు లేదు.

బ్రతుకులన్నిమాయ భవబంధములుమాయ తెలివి మాయ తన్ను తెలియమాయ
మాయ దెలియువాడె మర్మజ్ఞుడగు యోగి విశ్వదాభిరామ వినురవేమా 39

బ్రతుకులు, సంసారబంధములు, తెలివి, చివరికి తనను తాను తెలియనీయకుండా చేసేది అన్నీ మాయ పనే. క్రియాయోగ సాధనతో ఈ మాయను గ్రహించి దానికి అతీతముగా ఎదిగినవాడే మాయ యొక్క మర్మము తెలిసిన యోగి.

బ్రహ్మమనగ వేరే పరదేశమునలేదు బ్రహ్మమనగ తానె బట్టబయలు
తన్ను తానెరిగిన తానె పో బ్రహ్మంబు విశ్వదాభిరామ వినురవేమా 40

బ్రహ్మమనగ వేరే పరదేశమునలేదు, బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి అనగా బ్రహ్మజ్ఞానము తెలిసినవాడే బ్రహ్మ కనుక తననుతాను తెలిసికొన్నచో తానె బ్రహ్మము.

మనసులోనిముక్తి మరియొకచోటను వెదకబోవువాడు వెర్రివాడు
గొర్రెచంకబెట్టిగొల్ల వెదకినట్లు విశ్వదాభిరామ వినురవేమా 41

మనయేవ మనుష్యాణాం బంధమోక్ష కారణం. మనస్సే బంధానికి గాని మోక్షానికి కారణం. గొర్రెచంకలో బెట్టుకొని గొల్లవాడు వెతికిన చందమున మనస్సుని స్థిరము చేసి కోవడమే మోక్షము.

మనసులోనేపుట్టిమాయసంసారము మనసు విరిగెనేని మాయతొలగు
మనసునిల్పెనేనిమహితానేబ్రహ్మము విశ్వదాభిరామ వినురవేమా 42

సంసారము అనేది చంచలమనస్సు వలన కలుగుతున్నది. క్రియాయోగ సాధనతో మనస్సు స్థిరము అయితే తానే బ్రహ్మము అవుతాడు.

ముక్తిగానలేనిమూర్ఖజనులకెల్ల బట్టబయలుజేసి పరమపదము
దారిజూపుఘనుడుదైవంబుగాదొకో విశ్వదాభిరామ వినురవేమా 43

గురువు గొప్పతనమును వివరించారు యోగి వేమన ఇక్కడ. సాధకులకి ముక్తికై దారిజూపే ఘనుడే దైవములాంటి గురువు.

రాతిబొమ్మకేల రంగైన వలువలు గుళ్ళు గోపురములు కుంభములును
కూడుగుడ్డ తానుకోరునా దైవంబు విశ్వదాభిరామ వినురవేమా 44

ఇక్కడ విగ్రహారాధనను నిరశిస్తున్నారు మహాయోగి. పరమాత్మ సర్వశక్తిమంతుడు, సర్వవ్యాపి, మరియు సర్వజ్ఞుడు. అటువంటిది ఆయనని క్రియాయోగ సాధనతో సాధించవలయును. అంతేగాని రాతిబోమ్మలను రంగు రంగుల గుడ్డలతో అలంకరించి, గుళ్ళు గోపురములు కట్టి ఆ రాతి విగ్రహాలకి ఆహారము అర్పించుట అనేది మూర్ఖత్వము. అన్నీ తానె అయిన పరమాత్మ కూడుగుడ్డ కోరడు.

వాక్కువలన గలుగు పరమగు మోక్షంబు వాక్కువలన గలుగువరలుఘనత
వాక్కువలన గలుగునెక్కుడైశ్వర్యముల్ విశ్వదాభిరామ వినురవేమా 45

ఓంకారోచ్చారణవలన ఎంత ఉత్తమమైనదో వివరిస్తున్నారు మహాయోగి. ఓంకారోచ్చారణవలననే మోక్షం, ఘనత, ఐశ్వర్యములు కలుగును.

శిలను ప్రతిమజేసి చీకటింటనుబెట్టి మొక్కవలదికను మూఢులార
ఉల్లమందుబ్రహ్మముండుట తెలియుడీ విశ్వదాభిరామ వినురవేమా 46

విగ్రహారాధనను ఖండిస్తున్నారు మహాయోగి. రాయిని ప్రతిమగా జేసి చీకటింటనుబెట్టి మొక్కవలదికను మూఢులార. ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి అని గీతావాక్యము. పరమాత్మహృదయములోనే ఉన్నాడు. శిలలలో వెతకటము తెలివిహీనత.

సకలతీర్థములను సకలయజ్ఞంబుల తలుగొరిగినంత ఫలము గలదె
తలలుబోడులైన తలపులుబోడులా విశ్వదాభిరామ వినురవేమా 47

అన్ని పుణ్యక్షేత్రములలోను, యజ్ఞసమయముల లోను, తామసికతను తీసివేయటానికి తద్వారా యోగసాధనలో ఆలోచనలు రాకుండా ఉండటానికి ప్రతీకగా తలలుగొరిగించుకుంటారు. తలలు బోడు లైనంత మాత్రమున తలపులుబోడులా అనగా ఆలోచనలు రాకుండా ఉంటాయా?

హృదయమందు నున్న ఈశుని దెలియక శిలలకెల్ల మ్రొక్కు జీవులార
శిలలనేమియుండుజీవులందేకాక విశ్వదాభిరామ వినురవేమా 48

విగ్రహారాధనను ఖండిస్తున్నారు మహాయోగి. హృదయమందు నున్నపరమాత్మను తెలిసికో. శిలలలో ఏమీలేదు. మనలోనే ఉన్న పరమాత్మను సాధనతో దక్కించుకోవలయును.

.

# మావద్ద లభించు గ్రంథములు

## 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మి - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

| | | |
|---|---|---|
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |

| | | |
|---|---|---|
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |

| | | |
|---|---|---|
| 65. | ఆనందసిద్ధి - 2 ఏ సమస్యకు ఏ స్తోత్రమ్ పారాయణచేయాలి | 108-00 |
| 66. | ఆనందసిద్ధి-3 మానసదేవీ స్తోత్రమాల | 108-00 |
| 67. | శ్రీ కాలభైరవ రక్షా కవచమ్ | 63-00 |
| 68. | అర్చన | 40-00 |
| 69. | నిత్యదేవతార్చన | 40-00 |
| 70. | సర్వదేవతా స్తోత్ర నిధి | 99-00 |
| 71. | శ్రీచక్ర నవవరణార్చన | 63-00 |
| 72. | చండీ సప్తశతి పారాయణ క్రమం | 99-00 |
| 73. | శ్రీదేవి స్తోత్ర రత్నావళి 32 దేవి స్తోత్రాలకు తాత్పర్యంతో | 99-00 |
| 74. | వనదుర్గా మంత్రానుష్ఠాన క్రమమ్ | 63-00 |
| 75. | శ్రీ కాలభైరవ వ్రతము | 63-00 |

## 3. శ్రీ సాయి దత్త గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ సాయిబాబా సచ్చరిత్ర | 120-00 |
| 2. | సంపూర్ణ శ్రీ గురు చరిత్ర | 120-00 |
| 3. | శ్రీ సాయిఆరాధన-షిర్డివైభవం | 120-00 |
| 4. | శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర (క్రౌన్) | 63-00 |
| 5. | శ్రీ గురుచరిత్ర (క్రౌన్) | 63-00 |
| 6. | నవనాథ చరిత్ర | 99-00 |
| 7. | శ్రీసాయిచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 8. | శ్రీగురుచరిత్ర (బైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 9. | సత్యదత్తవ్రతం దత్తాత్రేయపూజాకల్పం,సహస్రంతో | 30-00 |
| 10. | అనఘాదేవీ వ్రతం | 30-00 |
| 11. | భక్తుల ప్రశ్నలకు బాబా జవాబులు | 30-00 |
| 12. | శ్రీ సాయిపూజాకల్పం (సహస్రంతో) | 25-00 |
| 13. | శ్రీ సాయిభజనమాల | 20-00 |
| 14. | శ్రీ సాయి భజన్స్ | 20-00 |
| 15. | శ్రీ సాయిభక్తి గీతాలు | 20-00 |
| 16. | శిరిడిహారతులు (భావంతో) | 20-00 |
| 17. | "శ్రీసాయి"కోటి | 27-00 |
| 18. | "శ్రీసాయిరామ్"కోటి | 20-00 |
| 19. | శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 10-00 |
| 20. | శ్రీ సాయివేయినామాలు | 8-00 |
| 21. | శ్రీ సాయి హారతులు (పాకెట్) | 15-00 |
| 22. | శ్రీ సాయి స్తవనమంజరి | 10-00 |
| 23. | హిందీ శ్రీ సాయి హారతులు | 15-00 |

